శ్రీశివాయనమః.

# శివతాండవలీల

గ్రంథకర్త:

కవిభూషణ, కవితాప్రవీణ, శతావధాని,

జ్యోతిర్విద్యావిశారద

ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రి.

కుమార ముద్రాక్షరశాల,

వరంగల్.

మే 1941.

# ఆశీర్వాదము.

ఓనరసింగగుప్త! త్వదనూన మహేశపదారవిందయుఙ్
మానసభక్తి నశ్వత సమారాధను డాగతుడై భవద్గృహా
స్థానవిభాసి చిత్రగత తాండవమన్న నెపాన నిల్చె ని
ర్గానగ నిత్యమట్లగుటగా దలపోయుచు నాడు నిన్ను న
ర్గానగజేయ నొక్కపని గల్పనచేసి తదీయ తాండవా
ఖ్యానము వ్రాయజేసె నది యట్టిద కావ్యము పూర్తియైన యం
తే నిను వీడియేగుటకు నొంతయు నొచ్చి భవత్కృత ప్రతి
ష్ఠానమహత్వమెంచి తన సంస్కృతి బంధువులైన శ్రీమహా
సేనుడు విఘ్ననాథుడను చిన్నికుమారుల నన్నపూర్ణయ
న్మానిని శ్రీభవానియను మానిని నాదగు నాంధ్రగూడి దా
బూనిక వచ్చి నీవిడు నపూర్వగృహంబున విశ్వనాథనా
మాన ముదాన నిల్చెను సమంచిత తచ్చరణారవింద పూ
జానిహితంబు నొటను ప్రసాదమనందగ గావ్య మిద్ది స
న్మానముతో గ్రహించి బుధమాన్యుడవై యశ మొంది పూర్ణ సం
తానయుతుండవై శివకథారసమగ్నమనస్వివై త్రిగో
ధానయుతారివై నయపథంబున వర్తిలు మెల్లకాలముఙ్
వీనులు తత్కథాక్రమము వింటను చిత్రముగాంచి కన్నులఙ్
మానసమున్ స్మరించుటను మంజులరీతి నచించి వక్త్రమున్
పూనియు పొత్తమున్ కరమునూర్ధమునున్ వహియించినా నయా
ఘ్రాణముచేసి పుణ్యమును గాంచి తదీయ ఫలంబులొందుతఙ్

# కృతిసమర్పణము.

ఉ॥ వేదవిభాగముఁ సలిపి విశ్వహితం బొనరింప వ్యాసుల
ష్టాదశధాపురాణముల సంస్కృతభాష లిఖించె వాని య
దాది గణింపగా దగిన యట్టిది స్కాందము నాట్యరంగకై
కాద శిరోగ్రభాగమణికాంతి దిశాదశకాంతరోల్ల స
త్పాద వినూత్న నర్తనవిధాన సముద్భవ జంఝుళార్భటీ
నాదము భారతావని ననారత భక్తవిశాలకర్ణసం (మ
మోదము గూర్చె తత్కథయె మూలముగాగ గ్రహించిని
ర్వ్యాదయితాంఘ్రిపూజనపరాయణుడౌ నరసింగగుప్త త
ద్వాద సమర్థనక్రమవిధాన సుచిత్రము వ్రాయజేసె త
ద్భేద మొకింత గల్గని విధిఁ కవి పండిత మాన్యమార్గ
ర్వాద మొకింతయుఁ విడని యట్లుగ కావ్యము వ్రాసియుంకి
బీ దలపోసి యత్నమున నేర్చిన యుత్పలమాలతో భవ
త్పాదసరోజయుగ్మముల బ్రాపున బెట్టితి భక్తితోడ నీ
వాదృతితో గ్రహించుము మహాయశ మొందగ జేసి కావ్యము
మేదిని నన్ను వైశ్యవరునిఁ భవదీయ పదాబ్జభక్తి భృ
ద్వాద నిరీక్షణ శ్రవణ వాంఛితులం దగ జేయగోరుదుఁ
శ్రీదయితార్చితాంఘ్రిసరసీరుహా! శంకర! తాండవక్రి
చోదిత పుణ్యవర్తన వసుంధరగల్గు జనంబులెల్ల వే
దోదితమౌ త్వదీయమహిమోన్నతిగాంచియు వించుభక్తి
త్పాదములాశ్రయించి భవబంధవిమోచకులై చెలంగుత



ఆకారపు నరసింగం శ్రేష్ఠి, వరంగల్.

శ్రీ శివాయనమః

శ్రీ మహాగణాధిపతయేనమః

శ్రీ మహాసరస్వత్యైనమః

అస్మచ్ఛ్రీగురుచరణారవిందాభ్యాంనమః

# శివతాండవలీల.

శా॥ శ్రీకాంతుఁడయి యేఫలంబుగొనపూజించెఁ శివుఁ విష్ణువఁ
లోకంబందలి సంశయంబు విడనాలోచించి శ్రీశైలమం
దాకల్పాంతచరస్థలాఖ్య సకలార్చార్హుండు నా శంభుఁడీ
యాకారం నరసింగగుప్తకును నిత్యశ్రీలు జేకూర్చుతఁ 1

మ॥ గిరిజాదేవి శివార్ధదేహమున నున్కింగోరెనో? పార్వతిఁ
హరుఁడేగోరెనో?యన్న సందియము వాచ్యంబిర్వురందేదియో
వరకాంతారతి నీకు తుల్య భ్రమరాంబాదేవి యాకారపుం
నరసింగంబునకుఁ సుతోత్సవకృతానందంబు జేకూర్చుతన్

మ॥ నరసింగంబొనరించుకార్యములవిఘ్నంబుల్ దగన్ జేయుచున్
నిరతంబున్ తదనల్పపూజలుగొనన్ నేర్పుల్ కడుం గల్గునో
హరపుత్రాగ్రణి!నీకుతాండవముప్రియంగాతలంపయ్యెనా
నరసింగం బొనరించు పూజలకె యానందించి మేలీయుమా

చ॥ అడిగెడు వేళ ప్రశ్నముల నాదృతి జెప్పెడు వేళ సందియం
బుడిగెడు వేళ పండితుల యొప్పిదముఁ గను వేళ సత్సభఁ

నడవడి మెచ్చు వేళ కవనంబును జెప్పెడు వేళ సర్వము
నుడులగు నవ్వి నీకును తనుత్వముగా మదిగొల్తు భారతీ!

ఆ॥ నాకు మిన్నలగుచు నా భక్తజనములు
జగతి పూజ్యులనుచు శంభు డనియె
గాన భక్తపాదకంజంబులకు భక్తి
శరణు జేతు నీశు సము లటంచు.

సీ॥ అభ్యస్త వేదత్రయాంగ షట్క స్ఫూర్తి
శంకరారాధ్య విస్తారకీర్తి
అసమాక్షు పూర్ణభక్త్యభ్యాస సంపూర్తి
బసవనారాధ్య సంప్రత్ప్రవృత్తి
శివకథామృతపాన చిరతరానంది శ్రీ
మల్లికార్జునమూర్తి మహితకీర్తి
షట్స్థల జ్ఞాన నిశ్చలభక్తి వైరాగ్య
హృత లింగధారి మహేశ్వరాళి

తే॥ కలిగి యెచ్చోట శంభునికాయములును
అన్నసత్రంబు లఖిల విద్యాలయములు
ధారుణీస్థలి నాంధ్రభూ తార హార
హీర మననొప్పు నన్నిట నోరుగల్లు

సీ॥ పరశివధ్యాన సంపత్తి లెక్కింతురు
లెక్కింప రన్యమహా రోకములను

శివకథామూల్యముల్ స్థిరమతి విందురు
విన రన్యమగు వస్తువితతి ధరలు
అభవునామోచ్చారణాసక్తి నుండుదు
రుండరు భవులతో నూదిబలుక
సప్తసంతాన విస్తరణ సంపూర్ణులు
పూర్ణుల మన రెట్టి పుత్రులున్న
తే॥ సంతతం బిష్టలింగపూజాసమగ్ర
వస్తుసంపాదనోత్సుక వర్తకంబు
గలిగి పురిలోని వైశ్యులే కాలమందు
శివకృపాసాంద్రదృష్టి కాశ్రితులగుదురు. 7

తే॥ ఆ వరంగలునందు సాయంతనమున
భక్తజనులనుగను వేడ్క పాదచారి
నగుచు జనువేళ గానంగనయ్యె నొక్క
రమ్యసౌధంబు భక్తవిరాజితంబు. 8

తే॥ కరుణ చిన్నతనాన వ్యాకరణమందు
కావ్యములయందు జ్ఞానంబు గలుగునట్లు
దిద్దినట్టి గురుండు పితృవ్యు లిష్ట
లింగనిష్ఠులు వీరేశలింగశాస్త్రి
అయ్యవారలు నాకు పురాంతరమున
గలవిశేషంబులెల్లను దెలుప గోరి.

తే॥ వెంటవచ్చుచు నేపురవీధిలోన
సౌధరాజంబు గని నిల్చి సరణి చూచి
ప్రశ్న మొనరించె నిల్చి కారణము నన్ను
నేను వారికి నతిభక్తి నిట్టులంటి.

చ॥ గురువర! ఈగృహంబుగన గోర్కె జనించె మనంబులోన
కరయగ నెప్పు డర్హసమయంబగునో యని తెల్పుమన్న
త్కరమున నిల్లుచూపి యిదె గానగపోవుదమంచు బల్కి
త్వరగతి ముందుకుగా నడచె తత్కృపగా వెనువెంట నేగితి

ఆ॥ అటుల బోయిగంటి మాసౌధరాజంబు
విలువ చెప్ప నాకు నలవియగునె ?
యనుపమానమయిన యానందమునుగూర్చి
భోగమునకు మితము పుడమిగలదె?

క॥ మూడంతస్థులు గల్గియు
జూడగ నాశ్చర్యమగుచు జూపరులకు శ్రీ
తోడను శ్రీసోదరరుచి
తోడను గూడిన విధాన తోచెడి నెపుడున్

తే॥ కలదు మొగసాల స్తంభయుగ్మముల గూడి
పాంధజనముల దృష్టులు బరగు కతన

విస్తృతంబయి యందమై వెలయుచుండు
ద్వారమున రెండుదిశల గవాక్షములను 13

శా॥ ఆ ద్వారంబు నతిక్రమింప ధనలేఖ్యస్థానమందుంద్రు ప
త్రద్వారా ధనమిచ్చి పుచ్చుకొను వారల్ దాని పైనన్ మహా
విద్వద్వర్యులు నిల్చు శాల యయినన్ వేశ్వేర లింగార్చనా
కృద్వాంఛాహితహార్మ్యముల్ గలవు పైకి న్బోవు సోపానముల్

తే॥ నేల బరచిరి యట జల్వరాల నంత
గోడలందెల్ల జిత్రముల్ గూర్చినారు
చాల కుర్చీలు నూగ నుయ్యాల నిలువు
టద్దములతోడ గలవు గవాక్షములును. 15

శా॥ ఆ సోపానపథంబున న్బయికి బో నచ్చోట నందంబులై
భాసిల్లున్ ఘనచిత్రచిత్రములు సోఫాలున్ ఫొటోగ్రాఫులున్
దాసీ దాసజనంబులున్ నిలువుటద్దంబు ల్మహాసౌధముల్
శ్రీసంధానములన్ పదంబు నిజమౌ చిత్తంబులో నెంచగన్

సీ॥ అంత పైయంతస్తు నరయు బోదము గదా
యద్భుతంబై తోచె నచటి పనులు
పింగాణి బిళ్లల బేర్చి గూర్చిన యట్టి
రంగవల్లుల మధ్యరంగములును

నలుదిశలందును నిలువుటద్దంబులు
నటునిటు చిత్రమౌ పటము లొప్పు
సోఫాలు కుర్చీలు సొంపైన మేజాలు
ఉయ్యాల సోఫాలు నొప్పుచుండు
తే॥ అద్దముల బీరువా లందు నందమైన
విగ్రహములుంచి విద్యుత్తు వెలుగజేయ
చిత్తమునకును దోచు విచిత్రముగను
ఇంద్రసౌధం బనంజాలు నెల్లరకును. 17

మ॥ శయనాగారముగల్గు దిగ్దశతటస్థాప్యోల్ల సద్దర్పణో
న్నయనంబై గనువారలొక్కరొకరే నానావిధుల్ దోచెడిన్
వయసుల్ జక్కదనంబు గల్గుయువతీ ప్రాచుర్యచిత్రంబు
ల్గుయధారీతినినొక్కటైయిరువురల్ లోకంబుభ్రాంతిందగన్

చ॥ చెలగు శిరోగృహంబు పయి శీతమయూఖకరప్రసార ణో
చ్చలన విచిత్ర చిత్ర విలసద్రుచిమంతము భాస్కర ప్రభ
కలితవినూత్న నాకపతికార్ముకవంతము సర్వసౌధని
స్తులమహనీయకాంతిచయశోభనవంతము హైమవంతమున్

క॥ ఆ చంద్రశాల తూర్పున
జూచు జనంబులకు నధిక శుభసూచకమై
వాచామగోచారానిల
వీచికలన్ విసరు లతలు వృక్షములు వనిన్.

తే॥ వరుసగా మెట్లవెంబడి వచ్చునప్పు
డధికకాలంబు బట్టుట యాత్మ నెంచి
క్షణములోపల క్రిందికి జనగ జాలు
పథము నిర్మించె జారుడుబాడ యనగ 21

శా॥ విద్యుద్దీపము లొక్కమాటు వెలుగన్ విధ్వస్త గాఢాంధకా
రోద్యద్భాసితమై వెలుంగుచు గృహాంతోర్ధ్వ ప్రదేశంబులన్
విద్యుచ్ఛక్తి ముహుర్విజృంభిత మహావేగాధ్వ యంత్రక్రియా
సద్యోజాత సమీరణంబచట నిచ్చల్ వీచెడున్ శ్రేష్ఠమై 22

మ॥ శతమన్యున్ విధు కర్మసాక్షిని కుజాంచజ్జాత వేదోద్ధ ధ
ర్మాత్ముండైన బుధున్ సకర్బుర యశోభ్రాజున్ గురున్ భూమహో
ద్భుతశక్తిన్ సుకవి ప్రచేతసుని మందుం డాచు నొప్పారు సదా
గతు నర్ధేశతమున్ సకేతు శివునిన్ గానంగనౌ నష్ట ది
క్పతులం గూడిన వగ్రహంబులు సరూపంబుల్ దగన్ నిత్యమున్

తే॥ అట్టి హర్మ్యంబు నంతయు నరసి వచ్చి
యొక్క సోఫాను కూర్చుని యున్న మాకు
శివుని తాండవలీల యనా చిత్రపటము
జూపి యేదియొ జిజ్ఞాస చూపు జూచి 24

క॥ ఆకారము సద్గుణముల
కాకారము ధర్మమునకు నాకారము శ్రీ

కాకారము భక్తికినన
నాకారపు నామమయ్యె నన్వయమునకున్ 25

తే॥ అట్టి యాకారవాన్వయ మందుబుట్టి
వైశ్యవరులెందఱో ధాత్రి బ్రథితగీర్తి
నిలిపి మాహేశ్వరాంఘ్రి నిర్నిద్రభక్తి
శాలిసాయుజ్యముక్తిని జూరగొనిరి 26

క॥ ఆకారపు వంశాబ్ధిని
ప్రాకటముగ బుట్టినట్టి వైశ్యవరులలో
రాకాచంద్రుని విధమున
శ్రీకరు డుదయించె ధాత్రి చెన్నయ్య యనన్ 27

శా॥ చెన్నారూపమునందు ధర్మనిరతిన్ జెన్నారు గుణాళిన్ సదా
చెన్నాశంకరభక్తసంచయములో జెన్నా, ధనంబందునన్
జెన్నా, నిత్యము ధర్మకార్యకలనన్ జెన్నానటంచెంచి యో
చెన్నయ్యాఖ్యత గూర్పనెంచె విధి మంచిన్మించి నిన్గూర్చుటన్

శా॥ యాతాయాత సమస్తభూమశకటవ్యాపారకార్యాంతరా
యాతాయాత వియాతయాతవసనార్హంబై సుఖస్థానమై
చేతోమోద మొసంగు సత్రము దగున్ స్టేషన్ సమీపంబునన్
దాతన్ దెల్పెడు ధర్మహర్మ్యపు బహిర్ద్వారంబనన్ ఖ్యాతిచె

చ॥ అనయము భావలింగమున కర్చయొనర్చుచునాత్మముక్తికై
యనుదిన మారుకాలముల నర్చయొనర్చుచు దేహముక్తికై
తనువున నిష్టలింగమును దాల్చి యనారత భక్తిమోక్షముం
బొనర బ్రతిష్ఠ సల్పెను శివున్ గిరిజా మహితాలయంబునన్

క॥ ఆ చెన్నయాఖ్యగుప్తకు
శ్రీ చెన్నలరంగను నరసింగాహ్వయుఁడై
ధీ చెన్నును గీ చెన్నును
భూ చెన్ను ననంగ దొలుత బుట్టె సుతుండున్ 31

క॥ లలితేంద్రనీలకుంతల
కలితాభరణాంత రత్న కాంచన విలస
చ్చలితాక్షి వదనజిత పూ
ర్ణ లసద్ద్విజరాజబింబ రాజమ్మయనన్, 32

తే॥ తల్లి గుణవల్లి సద్వనితామతల్లి
అభవుపదపద్మభక్తి రసాలవల్లి
సిరులకును పాలవెల్లి నిర్జిత శరీర
కాంత్యమలవల్లి యాచకకల్పవల్లి 33

తే॥ నాగృహంబున గల్గు ననంతలక్ష్మి
• శీలగుణములు నాయందు జెలగు ననుచు

జెప్పనెంచియు యట్టి పేర్లొప్పునట్టి
భార్యల వరించె నుత్తమ వైశ్యుడతడు 34

తే॥ ఆగతానంతలక్ష్మి యనంతలక్ష్మి
శీలగుణములకెల్ల సుశీల యనెడు
ధర్మపత్నియుగుండును ధర్మగుణ వి
శిష్టుడన నొప్పు నా నరసింగగుప్త 35

క॥ బింబాధరలు శరచ్ఛశి
బింబానన కుంకుమార్క బింబసమేతల్
బింబప్రతిబింబము లను
బింబలు జితచికుర ముకురబింబల్ సవతుల్ 36

శా॥ భారద్వాజ పవిత్రగోత్రులు శుభాపస్తంభసూత్రులు విశే
షారాధ్యప్రతిపూజనాపరులు లింగార్చావధానక్షముల్
శ్రీరాజన్మదిగొండ నందయగురుశ్రేష్ఠాత్మజుల్ రామలిం
గారాధ్యుల్ గురుమూర్తులై బరగు శ్రీయాకారపుం శ్రేష్టికిన్

సీ॥ ప్రత్యూషమున లేచి పావనోదకముల
స్నాతుడై క్షౌమవస్త్రమ్ముల దాల్చి
భూతి తిర్యక్పుండ్రముగ బెట్టి యొడలెల్ల
రుద్రాక్షమాలల రూఢి దాల్చి

సంస్కృతస్థలమున శాలితండులచూర్ణ
రంగవల్లి విచిత్రముల దీర్చి
లలిత కాంచనకృత్యోజ్వల శంభుపూజోప
కరణంబు లందంద గలయ నుంచి
పంచామృతంబుల ఫల జలంబుల శుద్ధ
జలముచేత నభిషేచన మొనర్చి

తే॥ భూతి గంధంబు నక్షతల్ పుష్ప బిల్వ
దీప ధూప నివేదన దివ్యమంత్ర
పుష్పములచేత శంకరు పూజసల్పు
శ్రీమదాకారపుం నరసింగగుప్త 38

సీ॥ హేమవల్లీబద్ధ హీరరుద్రాక్ష ని
ర్మిత శిరోభాగ కిరీట మమర
మణులచే రుద్రాక్షమణులచే కాంచన
స్థగితమౌ కుండలద్వయము దనర
రుద్రాక్షమణుల పేర్లు మెడ నష్టోత్తర
శతసహస్రంబను సంఖ్య దనర
భుజముల మణిబంధములయందు రుద్రాక్ష
కాంచనబద్ధ కంకణము లొప్ప

తే॥ తనువు రుద్రాక్షమయము తిరోధానమగుచు
విరియు బండిన రుద్రాక్షవిటపి బోలె

పూజ యొనరించు నావైశ్యపుంగవుండు
నిష్టలింగంబు నత్యంత నిష్ఠతోడ 39

క॥ గురుపూజ ముందు సల్పును
చరపూజ యనంతరంబు సల్పును భక్తిన్
హరపూజ పిదప సల్పును
గురు చర హరపూజ సల్పగోరుచు నెపుడున్ 40

చ॥ అనుపమభక్తి తత్త్వమసి యర్థము సార్థకమౌ షడక్షరీ
మనువును నారువేలునొకమారుజపంబొనరించిమున్న కాం
చనమయ ఛత్ర చామరసుసర్వవిభూషణ తాళవృంతముల్
ఘనతర శంఖ ఘంటికలు గానము గీతము స్తోత్రపాఠమున్
మనవి నమస్కృతుల్ శివుని మంజుకథాశ్రవణ ప్రదక్షిణం
బును శివభక్తి సూచనయు పుణ్యపురాణకథాళి పాఠనం
బనుభవనిత్యసిద్ధముగ నక్షిశరీర మనోపధానముల్
బనుపడ నిష్టలింగమును భక్తినిపూజ యొనర్చు నిత్యముని

క॥ ప్రతి సోమవాసరంబును
హిత బాంధవ విప్ర గురు మహేశ్వర సుపురో
హిత సహితుండగుచు శివ
వ్రతమును నొనరించు భక్తభజనల తోడన్ 4

తే॥ అట్టి వ్రతమును గనుటకు నరుగుదెంచు
భక్తులకు నిచ్చు నధిక సంభావనములు

బియ్యమును పెట్టగా జేయు భిక్షుకులకు
భక్తి కరణాప్రపూరిత స్వాతుడగుచు 43

ఉ॥ ఆ నరసింగగుప్త శివునంగు మహేశ్వరులంగు భక్తిచే
దానయి శంభుతాండవకథాకృతిను మెల్ల సమగ్ర రీతిగా
మానస మందెఱింగి బుధమండలిచేతను శిల్పిచేత శా
స్త్రానుమతంబుగా కడురయంబుగవ్రాయగ జేసెచిత్రమున్

క॥ ఆ పటమునె మును మాకును
జూపుచు జిజ్ఞాస చూపు జూచుట గని తా
సోపజ్ఞాంతంబుగ గురు
డీ పగిది వచించె భావ మెఱిగిన కతనన్ 45

తే॥ వినుము నరసింగగుప్త సవిస్తరముగ
మాకు స్వగ్రామమైన యీామని నివాసి
మామక జ్యేష్ఠజనకుని మనుమడితడు
కొండయారాధ్య సూరిమి కొడుకితండు 46

క॥ జ్వాలాపతిలింగం బన
జాలున్ వ్యవహార నామ సరణిన్ ధాత్రిన్
లీల నొనర్చె వధానం
బాలయమున నిన్న సభ్యు లానందింపన్ 47

క॥ నా వంక దిరిగి గుప్తకు
భావంబున నేమి గలదొ! పరికించితివే?
యీ విధముగ తాండవకథ
గావింపగ నీవు కృతిని గలుగుననీ యనన్ 48

ఉ॥ ఏనును తద్వచస్సును శివేప్సిత మౌ నని యెంచు లోన దా
లోనికి బోయి తాండవ విలోల సుచిత్రము దెచ్చియిచ్చె స
న్మానము తోడ వైశ్యకులమాన్యుడు నౌనరసింగగుప్త యీ
శానుడు వెండి చెప్పినిది సత్యమటంచును వ్రాయ బూనితిన్

—♦ కథాప్రారంభము. ♦—

ఆ॥ పసిడికొండ చేత బరగిన వానికి
వెండికొండ యిల్లు వెలయవచ్చు
ననుచు బత్తులెల్ల నాడుకొన నివ్వని
వెండికొండ యందు వెలయు వేల్పు. 50

శా॥ నిర్వర్తించుచు జ్ఞానిసంఘసభ నుండెన్ రత్నపీఠంబునై
శర్వుం డాశ్రిత భక్తరక్షణ పరీక్షా దక్షలోలాత్ముడై
పార్వత్యన్వితుడై సుతద్వయ హరి బ్రహ్మాది దేవాళి పూ
ర్వార్వాచీన మహేశ్వర ప్రతతితో నానంద వర్ధిష్ణుడై. 51

తే॥ అట్టి యెడ లోకవార్తాపహారి యైన
నారదుడు వచ్చి తనుజిత పారదుండు
భవపదాబ్జంబులకు భక్తి వందనంబు
సల్పి యిట్లను వినయ వాక్సరణితోడ. 52

చ॥ హర! వివరించెదర్ భువి చరాచరవస్తుచయంబు లెల్ల నీ
కరుణ జరించు నంచు వినగా మును నిప్పుడొకండు పుట్టెనీ
హరి విధి జిష్ణు ముఖ్యులగునట్టి సురల్ తమవల్లనే చరా
చరమగు విశ్వ మిట్లలరుసత్యమటంచు వచింత్రు నిక్కమే?

తే॥ ఇదియె సందేహమై నాకు నెల్లయపుడు
తోచకున్నది చెప్పవే తొలుత ననిన
నవ్వి శివుడంత విశ్వతాండవము సేయు
నాకు దగుగాక యన గౌరి నగుచు ననియె 54

మ॥ అనఘా! తాండవమాడ నీవొకడవే యర్హుండ నో దంటివే
యనగా గోర్కెజనించె తాండవము లేగావింపుమాయంచుగో
రిన గౌరీసతి కాత్మనర్తనసుపారీణత్వముం జూపగా
మనమందెంచుచు విష్ణుముఖ్య సురసంపద్గర్వము న్మాన్పగన్

తే॥ రత్నపీఠిని పార్వతీరమణి నుంచి
ముందు నొనరించె తాండవమును శివుండు

అఖిల విశ్వాంతరస్థ చరాచరమయ
సర్గ చిదచిత్స్వరూపాత్మ శక్తి యనగ

సీ॥ భయవిహ్వలత జెందు భక్తకోటుల కెల్ల
నభయ మొసంగు నొక్క హస్త మెత్తి
గర్వాభిమాన సంకలిత మూర్ఖ శిరాళి
పయి బెట్టుగతి నొక్క పాద మెత్తి
సకల జగంబుల చాప చుట్టగ జుట్టి
పయినుందునని యొక్క పాద మూని
చేతిలోనివి జగచ్చిత్రంబులను రీతి
నొక చేత డమరుక మొడయ బట్టి
తే॥ మెట్టి కోర్కెలు మదిలోన నెప్పుడెపుడు
గలుగునప్పుడు నప్డు జగంబులెల్ల
నేను సల్పుదు ననురీతి నిచ్చ శివుడు
తాండవము సల్పె గౌరి సంతసము చెంద

ఉ॥ వంచి శరీర మొక్క యెడ వామనరూపత నొక్కయప్పు
కుంచితరూప మొక్కపుడు కోమలరూపత నొక్క చో
మించిన నేర్పుతోడను క్రమించి నటించె విరించిముఖ్యా
ర్చాంచిత నర్తనంబున సురల్ భ్రమియించి భజించుచుండగ

సీ॥ వాద్యవిశేషమై వరలెడు డమరుచే
నలరు హస్తము శికారాక్షరంబు

నలుదిక్కులకు బాహువులు గల్గ నని చెప్ప
గా జాచు చెయ్యి వకారమగును
ఆర్తులౌ భక్తుల కభయప్రదంబైన
హస్తమయ్యెడు యకారాక్షరంబు
భక్తపాతకతూల పావకాంచితమైన
హస్తంబునగు నకారాక్షరంబు
తే॥ అంతరారి బహిశ్శత్రు సంతతులను
నాశనంబు నొనర్చెడు నర్తనంబు
నలరు పాదంబుదగు మకారాక్షరంబు
ననగ తాండవమాడె నయ్యభవుడపుడు. 59

సీ॥ ఆద్యవర్ణంబైన యట్టి శికారంబు
శివతత్త్వవిషయసూచియును గాగ
ద్వితీయవర్ణమై వరలు వకారంబు
శక్తితత్త్వవిషయసూచకము గాగ
తార్తీయవర్ణమై దగు యకారంబును
ఆత్మతత్త్వసూచకమై వెలుంగ
చాతుర్థవర్ణమై జను నకారంబును
సత్తిరోధానసూచకము గాగ
తే॥ పంచమంబయి యొప్పు మవర్ణమరయ
ధాత్రి నజ్ఞానమలమయి దనరుచుండ

సర్వజగతీస్వరూపుండు శంకరుండు
ననగ తాండవమూడె నయ్యభవుడపుడు

సీ॥ అఖిల పృథ్వీతత్వ మగును మకారంబు
కాయముల్ విషయంబు ఘ్రాణవృత్తి
సలిలతత్త్వం బనజను నకారంబును
సింధ్వాదివిషయంబు జిహ్వావృత్తి
అగ్నితత్వంబన నగు యకారంబును
ఆగ్నేయవిషయంబు నక్షివృత్తి
వాయుతత్వంబన వరలు వకారంబు
చలనంబు విషయంబు చర్మవృత్తి
తే॥ గగనరూపంబు నగును శికార మరయ
రూఢి శబ్దంబు విషయంబు శ్రోత్రవృత్తి
దనరునాధేయ మెటుల నాధారమందు
దానునట్లుందుననుచును దాండవించె

క॥ పంచాక్షరరూపుండును
పంచమతత్వంబు భూతపంచకమయుడున్
పంచత్వరహితు డగుటను
పంచవిధంబులను తాండవంబొనరించెన్ 6
తే॥ అఖిల జీవులయం దంతరాత్మనగుచు
వెలుపలను నిండి పూర్ణత్వమలయ నెపుడు

జగములెల్లను నాడించు సరణి యిదియ
యనెడి రీతిని తాండవమాడె శివుడు 63

క॥ పంచాక్షరముల యందును
పంచవిధంబులుగ నెట్లు ప్రణవంబుండున్
పంచవిధ భూతములలో
నంచితగతి నుండు ననుచు ననగ నటించెన్ 64

క॥ నటకాభినంద్య నటన
స్ఫుటతరవిజ్ఞానకీర్తి సూచిత మగుచున్
కుటిల సహస్రఫణాంచ
ద్రట దహిరాజాంఘ్రి నూపురంబు దలిర్పన్ 65

మ॥ పటు నాగేశ్వభుజకీర్తులొప్పగ భుజాభాగంబులన్ చంద్రమః
ఘటితానల్పకిరీటకాంతులు దిశాక్రాంతంబులై పర్వ త
న్నటరాజత్వము సార్థకం బొదవగా నానాగతుల్ సల్పెధూ
ర్జటి నాట్యంబును చక్రవర్తి తకెటన్ సార్థక్యమున్ జూపుచున్

చ॥ మనమునగల్గు భావము క్రమస్థితి దెల్పగ నక్షరంబులె
ట్లనువగునట్లు లే యభినయంబును దెల్పు నటంచు నిత్యమున్
దను జగమంతను సల్పువివిధస్థిరజంగమసృష్టి పుష్టి నా
శనవిధి సూచిరీతులను సారెకు జూపగ సల్పెనాట్యమున్

సీ॥ అరసియు వినియును నాత్మలో నెంచియు
నానందమగ్నులై నట్టి వారు
భవబంధములఁబాసి భవులోకమును డాసి
వర్తింతురనగ భవర్ణమునను
రవిశతభానులై రజతాద్రివాసులై
వర్తింతురనగ రవర్ణమునను
తత్పరభక్తులై తద్రూపధారులై
వర్తింతురనగ తవర్ణమునను

తే॥ విభుని గలయుదురనుటను బిందువునను
సహితమౌచును భరతమన్ శబ్ద మరయ
భరతదేశంబునకు నాట్యపద్ధతికిని
సార్థకంబను యశము సంగ్రహించె.

క॥ ఈ లీల శివుఁడు సంధ్యా
వేళను విధిముఖ్య దివిజ విసరము గొలువన్
హేళిన్ సుందర తాండవ
కేళిన్ దగసల్పెనఖిల కిల్బిషము లెడన్

తే॥ స్వరములందును గాత్ర సౌష్ఠవము నందు
రాగములయందు వర్ణ విశ్రమములందు
దగుననగ వంతబాడె నత్యంతమధుర
గానలలితకళామాత కమలజాత

చ॥ అనుపమభక్తి రాక్షసుల నాహవమందు జతుర్భుజంబులన్
బనిగొని మర్దనంబు సలుపన్ దనివొందని కేశవుండు తా
ననుపమ భక్తిగల్గుటమృదంగము తాండవమాచరించుచో
మనమున సంతసించుచు గ్రమంబున దన్మయుడయ్యెతృప్తుడై

తే॥ పల్కులకు జన్మభూమియై పరగువాణి
వల్లకినిగొని స్వచ్ఛమౌ వర్ణములను
బలుకగాజేసె సంగీత పటిమ దోప
జంత్రమంచును నెవ్వారెంచని విధాన 72

తే॥ భువనముల నెల్ల గొని తాళములను వేయ
జాలు విధి శంభుతాండవ సరణియందు
భయముభక్తియు వినయవిభ్రమము లలర
తాళములనైచె లయ యింత దప్పకుండ 73

చ॥ కుదురుగనున్న మాధవుని కూయనిరాక్షసులన్ వధింపగా
నదయత బాపజాలెడు మహాకృతి జిష్ణుడు వేణుగానమున్
ముదమునసల్పె తత్సహజమున్బచరించుచు కూస్వరంబునన్
విదిత సుపర్వకోటి నగ వేమరు భక్తి నవశ్యచిత్తుడై. 74

ఉ॥ నారదుడున్ విపంచి గొని నవ్యపథార్జిత గానవైఖరిన్
వారిజనాభముఖ్య సురవర్గము విస్మయమంది చూడ వి

స్ఫారత గోటమీటుచును బాడగసాగె నుమాసహాయుఁ
గారణకారణున్ విగతకల్మషనాము సుధాంశుధామునిన్

ఉ॥ తెప్పలు వాల్పక జ్జగము జేసి మనోహర తాండవంబు,
రప్పుడు చూచిచూచిసురలక్షులుమాయు టెఱుంగకుంటఁ
నప్పుడు విష్ణుడున్ సురలయం దని మేషతగట్టె నేరికిన్
జొప్పడునే? మరొక్క గతి శూలిఁ రీక్షణ గల్గకుండినన్.

క॥ హృద్య మహాశివతాండవ
సద్యస్సద్యోభిజాత సంగీతలస
ద్విద్యాధరతఁ గోరుట
విద్యాధరులనగ నైరి విబుధుల యందున్.

తే॥ శర్వతాండవ జనిత గంధర్వవిద్య
స్థిరముగా స్వర్గమందుండ జేయ శివుడు
తలచి గాంధర్వులుగను గంధర్వులుగను
గాంగధర్వులుగను జేసె గరుణ బుధుల

తే॥ శంభుతాండవ నిర్మలాప్సరసులందు
తనివి దీరంగ మునిగి సంతసముఁ జెంది
తాండవోదిత గానామృతంబు ద్రావి
యప్సరసలైరి కొంద రయ్యెడను దివిని.

క॥ త్ర్యక్షుని తాండవకేళిన్
రక్షింపగ నెంచి భక్తిరహితులు కనులన్
వీక్షింపకుండ జేయుట
రక్షులనందగిరి పో సురప్రకరమునన్. 80

ఆ॥ పక్షయుగమునందు భక్తితత్పరులౌచు
త్ర్యక్షుతాండవంబు నరయుచుంట
నక్షిపూర్ణమయిన యానందమును జెంది
యక్షులనగ విబుధులందు నగిరి. 81

కిన్నరమెట్లు మీటుచు నటించన గానకళావిలాసులై
యెన్నడు కల్పి పాడగల మీశ్వరుతాండవమందు నంచు దా
మన్ని విధప్రయత్నముల నారసి యే యొకయింత గానమిన్
కిన్నరులైరి దేవత లకిల్బిషులై శివుసత్కృపాప్తిచే. 82

తే॥ తాండవంబున సకల విధముల చేత
నెవ్వరును నీడుగామిని నెరుగు కతన
గుహ్యావృత్తిని నొకట దాగుటను జేసి
గుహ్యులన దేవకోటి చేకొనియె పేరు. 83

క॥ ఆ చతురబ్ధిపరీవృత
భూచరులం దెవరు నాట్యమును వినరో మీ

రా చెనటుల విషయమున పి
శాచములాడన శివుడు పిశాచములయ్యెన్

క॥ శంకరుతాండవమును గన
నంకలి లేదెపుడు మోక్షమందగ ననుచున్
సంకల్పసిద్ధులై భవ
పంకమువిడ సిద్ధులనగ బరగిరి సురలన్.

క॥ బోధంబగు తత్త్వంబున
బాధ్యంబగు తత్త్వమయిన పరు శంకరుగా
నాధ్యాసనంబున దమ దృక్
సాధ్యునిగాజేయ సురలు సాధ్యు లనదగెన్.

తే॥ చెవులు నటు నిటు నాడ ముచ్చెమటలూర
కరములు చలింపగా వక్రకర మలరగ
తాండవానందమగ్న చిత్తమున జేసి
విఘ్ననాధుండు తనపని విడచి యుండె.

క॥ కందర్పహరుని నాట్యా
నందంబున సురలు ముందు నడుపథమువిడన్
మందమతి జెంది యపుడా
స్కందుడు వారింపడయ్యె కనెనో? కనడో?

తే॥ నవ్యగానరసాస్వాదనంది నంది
యీశ్వరపదాబ్జ మధుపాన భృంగి భృంగి
యఖిల విఘ్నమహీరుహా చండి చండి
తలలు పకించి మెచ్చిరి తాండవంబు. 89

క॥ విధి హరియు నెల్ల సురలా
విధమున సేవించుకతన విశ్వనటకునిఁ
గ్రథిత స్వకార్యనామ
ప్రథితులునై రప్పుడిపుడు భవుని కృపాప్తిఁ. 90

క॥ వందారులౌచు హరిముఖ
బృందారలకు లెల్ల భవుని విశ్వజనకునిఁ
మంద మధుర స్వనంబున
నందఱునొక టౌచు నిట్టు లని రతిభక్తిఁ 91

చ॥ ఇదియు ప్రదోషకాలమగు నీశ్వర తావక తాండవంబునన్
సదమలచిత్తమబ్బె నఘసంచయము న్విడబాసె గర్వమున్
మొదలుగబోయె నీ మహిమము న్గనగల్గుతిమో కృపానిధీ!
యొదవగ జేయవే మఱికి నుత్సవ మిట్లు ప్రదోష వేళలన్. 92

చ॥ అని యిటు వేడు నా సురలనందర నాదృతితోడ జూచి యి
ట్లను శివు డింతమాత్ర వర మబ్బు టయేమి ప్రదోష వేళలం

దనయము తాండవింతు నపుడారయ మీరరు దెంచియిట్టు
మనమునకున్ ముదంబొదవుమార్గి స్వకార్యము లాచరింపు

ఆ॥ అనుచు సురలనెల్ల నానందమగ్నులు
గాగ సల్పి యంత కాలగళుడు
తాండవమునందు దన విశేషంబును
దెలుపునట్లు గౌరి వలను దిరిగె. 9

ఆ॥ అట్లు తిరిగినంత నగజాత నవ్వుచు
తెలిసె శక్తి జడము వెలియు లోన
గలిగియాడజేయు ఘనుడ నేనని గదా
యేను లేనిచోట యెట్టులుందు? 9

మ॥ అనినన్ బార్వతిజూచిశంకరుడు కాంతా! యేమివాక్రుచ్చి
వినుమా మామక తాండవంబులు చతుర్భేదంబులింక న్దగున్
గనుమా యొక్కడొకండు నీకును చమత్కారం బగున్ భక్తపు
జనముల్ గాంచ ప్రదోష తాండవమునిచ్ఛల్ సేతునజ్ఞానినా

తే॥ వినుము తాండవమగు పంచవిధములుగను
నందున బ్రదోషతాండవం బరయ నొకటి
యింక గల నాల్గుభేదము లెంచి నీకు
దెలియగాజేతు హైమవతీ! సుగాత్రి! 9

సీ॥ పంచభూతోత్పత్తి పరగ జేసెడువేళ
తాండవించిన దొక్క తాండవంబు
సకల చరాచరసమితి సల్పెడు వేళ
తాండవించిన దొక్క తాండవంబు
భక్త మనఃకాంక్ష ఫలము లిచ్చెడు వేళ
తాండవించిన దొక్క తాండవంబు
సకలలోకంబులు సమయజేసెడు వేళ
తాండవించిన దొక్క తాండవంబు

తే॥ యిట్లు నాల్గువిధంబులై యింపు మీరు
కల్గు నొక్కటి కొక్కటి కారణంబు
వేరువేరుగ నన్ని విభేదములను
నెలత కారణములను వర్ణింతు వినుము. 98

తే॥ అస్మదీయంబునైన యాజ్ఞానురూప
శక్తియె సమిష్టి భూతపంచకము సల్పె
వాని యందంతరాత్మత్వ వర్తనంబు
నాది తాండవ మన జెల్లు నగకుమారి! 99

తే॥ ఆ చరాచరసృష్టి యం దంతరాత్మ
నగుచు వెలుపల నంతట నావరించి
చిత్రచిత్రప్రవర్తనల్ సేయుచుంట
బరగు ద్వితీయతాండవ సరణి యనగ 100

తే॥ ఎట్లు క్రమరీతి నాయందు సృష్టిగలిగె
నట్టి విధమున దిరిగి నాయందె లయము
నలిపి యొక్కండనై యుందు సర్వమునకు
ప్రళయ తాండవ మనగను బరగు నదియె.

తే॥ భక్తుని మనోరథమును దీర్పంగదలచి
సవ్యపాదంబువిడి యాపసవ్యపాద
మునను సల్పిన తాండవమును ధరిత్రి
యగజ! వ్యత్యస్త తాండవ మనగబరగె.

మవతీ! ఎవ్వ రాత్మ నరణిగ నుంచి
ప్రణవంబు నుత్తరారణిగ సల్పి
నమథనాభ్యాస దగ్ధపాశులును నౌ
సలఘులు పండితులట్టివారు
నయంబు సన్నను నాదిమధ్యాంత ర
హితునిగాగను జగదీశ్వరుని న
పునిగాగ నిర్గుణునిగ నద్వితీ
యునిగను చిత్స్వరూపునిగ నెంత్రు
వ భక్తజనుల నొగి ముక్తులను జేయ
త్స్వరూప కాత్మసిద్ధశక్తి

చ॥అనయముభక్తకోటి హృదయంబుల బాయక నుండునెప్పు స
జ్జనులకు ప్రాప్యుడౌననగ చంద్రుడు గంగయుభూతి గల్గ దు
ర్జనులకు భీతిగొల్పగ గరంబును పాములు నగ్నిదాల్చుచున్
వినుమిది భక్తరక్షణకు వేయుదాల్చెడు రూప మద్రిజా!

చ॥ అనుచు సమస్తదేవతలయందు ప్రసన్న విలోకనంబులన్
బనుపడ తాండవంబున క్రమంబున శ్రాంతుడునైన భక్తి వీ
డ్కొని జని రెల్ల దేవత లకుంఠితభక్తి శివున్ స్మరించుచున్
మనమున పండితత్వమున మాటికి నీశ్వరు గాంచ నెంచుచున్

చ॥ ఎవడు ప్రదోషకాలముల నీశ్వరపూజ యొనర్ప నెంచునో
యెవడు ప్రదోషకాలముల నీశ్వరుగాన మదిం దలంచునో
యెవడు ప్రదోషకాలముల నీశకథాశ్రవణంబు నెంచునో
యవని నతండు శంకరుసమాకృతియై రజతాద్రి నుండెడున్

చ॥ అనుదినమున్ ప్రదోషసమయంబుల భక్తి తదిష్టలింగమున్
ఘన కరకర్ణికాసనమునం దగ వేదవిధిన్ జలాభిషే
చనమొనరించి భూతినిడి చందనమిచ్చి యొసంగి యక్షతల్
వనమునగల్గు పువ్వులు జలంబులపువ్వులు స్వర్ణపుష్పముల్
మునుగొని పూన్చి బిల్వదళముల్ పయినుంచియుధూపదీపక
ల్పనమొనరించి భోజ్యములు భక్ష్యములున్ దధి నేతితోని వే
దనమిడి తత్ప్రసాదమును తత్పరతన్ భుజియించు భక్తుడౌ
ననితరసాధ్యమై తగు శివైక్యమునొంద పునర్భవంబుగన్.

క॥ శివతాండవ లీలాకథ
నవహితమతి జనువ వ్రాయ సరసిన వినిన౯
భువి నైశ్వర్యముగల్గును
దివి సురసుఖ మబ్బెడు౯ తుది౯ శివు గలయు౯



# తాండవేశ్వర నక్షత్రమాల



ఉ॥ శ్రీమదుమాంగనా హృదయ సింధుగగర్వసమూలనక్షయో
ద్దామ విచిత్రతాండవవిధానకళాపరిపూర్ణమూర్తి స
ర్వామ లోక సృష్టివిషయప్రతిపాదన లుంపనక్రియా
శేముషి తాండవించు నిను సేవయొనర్చెద తాండవేశ్వరా!

ఉ॥ తాంతము ద్రష్టృభక్తజన తాంతని తాంతవిశాలనేత్రయు
గ్మాంతయు నారదాదిముని మంజులగానరసోల్లసత్కథా
వంతము శీర్షభాగసింధునర్తిత నిర్మలచంద్రికా యశో
వంతము మూర్తిమంతమని పల్కెద నీకును తాండవేశ్వరా!

చ॥ డమరుకహస్త! నీదు నికటంబున నిత్యనివాసులయ్యునా
కమలభవుండు విష్ణువును గానగలేమని బల్కు నీ మహా
త్వమును గనంగ నేదలచు వాంఛ భవత్కృప గల్గగోరి య
క్రమమొ? క్రమంబొ? నీవె యెఱుగంగలవాడవు తాండవేశ్వరా!

ఉ॥ వేమఱు నిన్నుగొల్చి నను విశ్వసనం బాకయింతలేక యే
మేమొ పరిక్షసేతువను యిట్టి యకీర్తి యదేల గల్గెనో
సామి! భవత్కృపాప్తి గనజాలెడు కృత్యము దేమొ తెల్పవే
నామది తత్వధంబును వినంగను గోరెడు తాండవేశ్వరా!

చ॥ శ్వేతురగుడైన భైరవుని సంతత శంకరభక్తరక్షణం
చతురిని గాశిపట్టణము సర్వవిధంబుల బ్రోచునట్లుగా
ధృతిమతిగల్గజేయుట త్వదీయ పదాంబుజభక్తి గల్గుట
వితతఫలంబుగాక మఱి వేరుగనబ్బునె? తాండవేశ్వరా

చ॥ రజతనగంబు కాపురము రాజులరాజు సఖుండు చేతన
ర్గజనిలయంబు మేరువు నగంబులరాజగుమామ పక్షిరా
డ్ధ్వజముఖ దేవసంచయము భక్తగణంబగు నిన్ను నే
త్రిజగములందు భైక్ష్యమొనరించెదు వాడన తాండవేశ్వ

ఉ॥ స్వామివి నీవటం చెఱుగజాలక నెప్పటికప్పుడేదియో
కామిత మాత్మనెంచుచు జగంబుల చెట్లను రాల గుట్ట
పాముల దైవతంబులను భ్రాంతిని పూజయొనర్చి వా
మేమియొ మ్రొక్కుచుందురిది యెట్టివిచిత్రము తాండవేశ్వ

ఉ॥ మిత్తిని గెల్చినానుగద మేలగునంచును నెంచవద్దు నీ
బత్తులు మిత్తికంటె బలుబాధలు బెట్టుదు రెక్కడెప్డు
వెత్తఱి డాగినన్ వెదకి యుంచుక నిర్మలభక్తిశృంఖల
యత్తునిజేసి మానసములందున నిల్పరె? తాండవేశ్వ

ఉ॥ ఆలుచెలంగు నర్ధతనువందున, నెత్తినగ్గ్లునొక్క పో
యాలు, కళంకి జూటమున, నగ్నిముఖంబున, భీతిగొల
కోలము కంఠమందు, ఫణికూటము విగ్రహమందు గ
లీల భజింపనేర్తు రవలీలగ భక్తులు తాండవేశ్వరా!

ఉ॥ కాలుని జంపు కారణము కాముని దగ్ధమొనర్చు హేతువుల్
ప్రోలులమూటిగాల్చుటకుబూర్వవిరోధమునెంచియెంచి యే
చాలును మూలగానక నిజంబుగ భక్తుల బ్రోవనెంచిగా
కేలనొనర్చు నీపనుల నీశ్వరుడందురు తాండవేశ్వరా!

చ॥ రవిశతకోటిదీప్తిని విరాజిలుదీ వనుమాట మాటయం
దవితథవృత్తిచే సగుణమంచును దెల్పు త్వదంతరాత్మవై
రవిముఖ సర్వతేజములు రాజిలు నీ కుపమానవస్తువీ
యవనిని లేదు భక్తివిషయంబగుగా యది తాండవేశ్వరా!

చ॥ పునరపునర్భవంబయిన మోక్షమొసంగగ జాలు వేల్పు వీ
వనుచు సమస్తవేదములు నాగమముల్ వచియింప వించున
న్ననయము నెల్లకోరికలయందును నిట్టటు లాగునట్టి యీ
మన మొనరించునట్టియవమాన్యుడనయితిని తాండవేశ్వరా!

చ॥ నలుమొగముల్ ప్రతిక్షణమనారతముల్ వచియించె నేనియున్
నలువ భవన్మహిమ్న వచనంబుల పారమెఱుంగడన్న యీ
పలుకులెరింగి యే నిటుల వ్రాయదలంచుట భక్తి నీపయిం
గలుగుటగాదలంపు నధికంబగు ప్రేమను తాండవేశ్వరా!

చ॥ రతనములందు వజ్రము, స్థిరంబులలోన యశస్సు, వృక్షసం
తతులను కల్పభూరుహము, దైవతధేనువు గోగణంబులన్
వ్రతముల నిండుమవాసరశివవ్రతముల్, మనుజుల పడక్షరిన్
వితతసురాళి నీశ్వరుడు, విశ్వసనార్హము తాండవేశ్వరా!

ఉ॥ సింగముజక్కి మీఁద నలుచెంగుల తోల్బులుకన్న పల్లముల్
రంగుగగట్టి లోని వహరస్థలులందున నొప్పు శత్రుమా
తంగచయంబు నుగ్గగు విధంబున స్వారి నొనర్చు దేవి న
ర్థాంగినిగూడి నామనసునందున నిల్వవె తాండవేశ్వర !

చ॥ గతమును నాగతంబు నెఱుఁగంగలవాఁ డొకరుండు లేఁడు నీ
కతమున సర్వవిట్లగుటగా దలపోయుదు పండితుఁడు నా
వితము నెఱుఁగఁడింతయు వివేకము మాటలయందె నీకృప
వృతుడగు వాఁడెఱింగి వివరింపగ నేరఁడు తాండవేశ్వరా!

చ॥ మునిగణమున్ గనన్ శివునిముందట హస్తయుగంబు నెత్తి ద
మనమున భీతిలేక భువి మాధవుకంటెను వేరు వేల్పు లే
డనివచియించు వ్యాసునకునై నపరాభవమున్ గణించియున్
జనుడు నినున్ స్మరించుటకుజాలడుగా విధి తాండవేశ్వరా

చ॥ నవనవచూతపల్లవమునన్ రసమానగ గోకిలంబె, గా
కవితతి కెల్లెఱుంగు నటుగావున తావక భక్తిచిత్త మా
నవుడు భవద్విశేషము గనంగలవాడగుగాక యన్యుఁడీ
చవి నెఱుగంగ నేర్చునె? విశంకటవృత్తిని తాండవేశ్వరా

చ॥ కువలయమిత్ర శబ్దమునకున్ శశి యర్థము రూఢియౌనొకో
పవలు మొగంబువిచ్చి గనుపాటొనరింపను నీకు నన్న న
కువలయమిత్ర శబ్దమునకున్ సరిపోలెడు రూఢి యర్థమై
కువలయమంతకున్ సుఖముఁగూర్చుకతంబున తాండవేశ్వరా

చ॥ సురలను గాచినావు, మునిసూను విపద్దశ మాన్చినావు, శ్రీ
హరికి కిరీటికిన్ మిగుల హర్షముతో భవదుత్తమాయుధో
త్కర వరచక్ర పాశుపత దానమొనర్చిన వాఁడ విట్టి ని
న్నెఱిఁగియు నన్యదైవముల కేటికి మ్రొక్కఁగ తాండవేశ్వరా!

చ॥తురగములాశ్రుతుల్ ,రవివిధుండునుచక్రయుగంబుక్షోణి యే
యరదము,బ్రహ్మసారథి,మురారియె తీవ్రశరంబుతోయధుల్
దరకస, మీవు వీఁడవు త్వత్పదభక్తుఁడ మన్మనోటవీ
చరదరివర్గమున్ గెలువ జాలవె? శక్తిని తాండవేశ్వరా!

చ॥ నొసలున నగ్ని బొట్టువలె నూతనశోభదలిర్ప, చంద్రుఁడున్
కుసుమసుమాలగాగ మురుగుల్ కడియంబులువుంగరంబుల
త్యసదృశసర్పముల్ దనర హారముగా మెడ నొప్ప శేషుఁడున్
భసితము పూసి నీకుగల ప్రౌఢత జూపుదె తాండవేశ్వరా!

చ॥ సవతులపోరు మాన్పుటకు జాలక నీవు విసంబు మ్రింగుటన్
భువి వచియింతు రిట్టి పనిబోలునె? నీసరివాని కబ్ధిసం
భవమయి లోకమెల్ల నొకమాటుగ గాల్పగ వచ్చు నగ్నినిన్
దివిజుల భీతిమాన్పుటకు తింటివిగాకటు తాండవేశ్వరా!

చ॥ గినియుచు నిన్ను నల్లుఁడను కించనబుద్ధి దలంచిదక్షుఁడే
వినగ నసహ్యవాక్కుల వివేకత పల్కిన గోపగించి నీ
తనయుని బంపి యజ్ఞమును ధ్వంసమొనర్పగ జేసి దక్షుదు
ర్మనమును మాన్పవే? సుజనమానసనర్తక! తాండవేశ్వరా!

ఉ॥ ప్రోత చరాచర ప్రకరరూపకసృష్టికి సృష్టవస్తు వి
జ్ఞాత సుషుప్తి యందునను స్వప్నమునందున జాగరంబునన్
దాతడ వీవటంచును మహామహు లెందఱో చెప్పవిందు స
ర్వాతిశయోత్తమోత్తమ మహామహిమోజ్జ్వలతాండవే ॥

చ॥ చురచుర నగ్నితప్తమగుచుం దగు నిన్నపెనంబు మీద బో
దరమొక యింతలేక హరదత్తుడు నిల్చుచు భక్తిచిత్తుడై
హరుడెసమస్తదేవతలయందునుబూజ్యుడటంచుబల్కె చూ
పరభయమొందధాత్రి శివభక్తి జయింపగతాండవేశ్వరా!

చ॥ తలచుచుసంతతంబు నిను ధర్మమొనర్చుచు నిన్నుగూర్చియే
పలుకుచు నీదు నామమును భక్తిని నీకథ లాలకించుచున్
గొలుచుచునీదుపాదములుకూర్మిజపించుచునీదుమంత్రమున్
వలగొనినిన్ను నీదు కృపవాంఛితమొందెద తాండవేశ్వరా!



కుమార ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె, వరంగల్. 1942.